శ్రీరస్తు.

# శ్రీసద్గురుప్రదర్శని.

ఇది

పోదిరాజు ఆదినారాయణచే

రచియింపంబడి

తెనాలిపురమున

ప్రకటింపంబడియె.




తెనాలి

సీతావిలాస ముద్రాక్షరశాలయందు

బే॥ జో॥ సూ॥ ప్రకాశరావుగారిచే

ముద్రింపంబడియె.

1913.

# ఉపోద్ఘాతము.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులును శ్రీమత్సద్గురుమూర్తులును అగు శ్రీకలదుర్గా ప్రసాదరావుగారు లోకోపకారార్థమై ముముక్షువులగు జనులకు ఒరావరణ రహిత మోక్షపదము నొసంగ దీక్షవహించియున్నవారు గావున యభ్యాసేచ్ఛగలవారలు అమ్మహానుభావు నాశ్రయించి ధన్యులగుదురుగాక యని యూహించి వారి ప్రభావంబు తేటపఱుప నుద్దేశించి గురుశిష్యులమగు మాయుభయుల సాత్రెంకిదమిక తెలిపిన యీచిన్న పుస్తకము విశదముకాఁగలదని తలచి అట్లు చేయుచున్నాఁడను.

ఇట్లు

బుధజనవిధేయుఁడు,

పోచిరాజు ఆదినారాయణ.

# విషయసూచిక.

---

1 నాజననస్థానాదికములు. 2 మాగురువులవారి జననస్థానాదికములు. 3 నాజన్మకాలమున బ్రహ్మవాత్రి. 4 మాగురువులవారి జన్మకాలమున బ్రహ్మవాత్రి. 5 నాబాల్యమున గలకోరిక. 6 వశిష్ఠులవారి సందర్శనము. 7 మాగురువులవారుపొందిన యుపదేశవిధము. 8 నాతండ్రిగారి మరణానంతరమున నావివాహకాలమువరకు:—

(a) నామనస్సుయొక్కస్థితి. (b) మాయుభయుల స్నేహము. (c) స్నేహమువలనిలాభము. (d) 1905, 1906, 1907 వ సంవత్సరములు. 9 వివాహము: ఉద్దేశము. 10 1908 వ సంవత్సరము. నందివెలుగుబడి. నాఉద్దేశము. భగవదుద్దేశము. గురువులవారి వివాహము. 11 స్వప్నము. సిద్ధపురుష సందర్శనము: ప్రత్యక్షసంభాషణము. సిద్ధపురుషుడని నిజముతేలుట. 12 గురువుల వారు పరీక్షలో "ఫేస్ అయ్యెద"వని చెప్పుట. 13 పరీక్షతప్పుట. దుఃఖము. గురువులవారు హేవ్యము తెల్పుట. క్రోధము. లాభము. భావికాలస్థితి: స్వప్నము. 14 శివశక్తి. ఔషధము. 15 నందివెలుగుబడి. ఔషధము. తమ్ముని వివాహము. సంవత్సరాది పండుగ. గురువులవారికష్టములు: దేవరహస్యము. గురువులవారిని దర్శించుట. సంతోషము. గురుపూజ. కార్యము. 16 గురువులవారి రెండవరాక. 17 గురువులవారు మూడవపర్యాయము అస్మద్గృహమున కేతెంచుట: ఉద్దేశము. భావికాలసూచకమగు స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవ ప్రారంభము. గురువులవారి రౌద్రము: గురువులవారికి కొమారుడనై పుట్టుట. కులవిద్య నభ్యసింపదగినకాలము వచ్చుట. మహర్నవమి, దీపావళి. గురువులవారు నన్ను వెంటబెట్టుకొని వల్లూరునుండి బయలువెడలుట. స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవముపరి సమాప్తి. 18 దక్షిణయాత్రలు సేవించుట. పొందినప్రయోజనము. 19 విన్నపము. 20 కోరిక. 21 చచ్చి దేవతలలోపుట్టుట—కేవలము ధర్మయుక్తము. 22 గురువులవారి పరిభాషము.

# శ్రీ సద్గురు ప్రదర్శని.



## గురువందనము.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ । తస్మై శ్రీగురవే నమః ॥

### వశిష్ఠసంభావనము:—గురుసంభావనము

ఏమహానుభావు సందర్శనమాత్రంబున లోకంబులోని జీవులకు అజ్ఞానాంధం బువిరిసి జ్ఞానోదయంబై పరమగురువులాభంబుకలిగి ఎఱుకతత్త్వంబు నుపదేశంబై జరామరణములనుండి నివర్తియగుచున్నదో యట్టి, సర్వసాక్షియును కార్యకారణ స్వరూపియునగు వశిష్ఠ ప్రదక్షిణ ప్రణామపూర్వకముగా సంభావించి "నీవే బ్రహ్మమగు" వనని నాకు తెలుపబోవు నస్మదాచార్యవర్యులగు శ్రీకుల దుర్గాప్రసాద రావుగారిని పరబ్రహ్మస్వరూపముగనే భావించి మనమున షోడశోపచారపూజసల్పి సర్వోపచారసారసంగ్రహంబగు ప్రదక్షిణ ప్రణామంబొనర్చి పరమహంస పరివ్రాజకాచార్యవర్యులును ముముక్షువులకు మోక్షమొసంగ దక్షులును అగు శ్రీకుల దుర్గాప్రసాదరావుగారి ప్రభావంబు తేటపరుప నుద్దేశించి గురుశిష్యులమగు మాయుభయుల చారిత్రంబును సంగ్రహముగా వివరింపుచున్నాఁడను.

ఆర్యులారా !

1. నాజననస్థానాదికములు:—నా పేరు పోచిరాజు ఆదినారాయణ, గ్రామం పెను గుదురుపాడు బాపట్లతాలూకా, గుంటూరుజిల్లా.

2. మాగురువులవారి జననస్థానాదికములు:—మాగురువులవారి పేరు చివుకుల వెంకటసుబ్బశాస్త్రిగారు మఱియును వారు శ్రీకుల దుర్గాప్రసాదరావుగారనియును నామాంతరము పెట్టుకొనియున్నారు.

3. నాజన్మకాలమున బ్రహ్మవ్రాత:— పదియేఁడు సంవత్సరములవఱకు జనసమూహమునందు వసించియు మహారణ్యవాసముపగిది దుఃఖముల గాంచుచు ఆరోగ్యము చెడి జ్ఞానమునొంది గురువును ఆరోగ్యముకొఱకును మోక్షముకొఱకును ఆశ్రయించి యథాశాస్త్రీయముగా కొమారుఁడై పుట్టి తదనంతరమున ఆయన పరమగురువని జనులకు వెల్లడించి తాను మోక్షమును ఆరోగ్యమును పొందుచు మఱి కొందఱిని మోక్షము పొందించునుగాత యని దేవరహస్యము.

4. మాగురువులవారి జన్మకాలమున బ్రహ్మవ్రాత:—పరమగురువై అధికారులగు శిష్యులకు మోక్షమును అనుగ్రహించునుగాత యని దేవరహస్యము.

5. నాకు బాల్యమునఁగలకోరిక:—విక్రమార్కునివలె తేజోవంతుఁడనై ఉదారసాహసములుఁగలిగి వర్తించవలెనని.

6. విశిష్ట సందర్శనము:—1904 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో రాత్రి రెండుజాములు తిరిగినమీఁదట నాకు ఈవిధముగా స్వప్నమయ్యెను:— "మాయూరిలో ఒకయింటి వసారా అరుగమీఁద కొన్నికష్టములను తలచి తలచి సొమ్మసిలి నిద్రించుచుండిన నాయొద్దకు ఒక మహాపురుషుఁడు హరినామము గానముచేయుచు తంబుర మీటుచు చిరుతలు వాయించుచును వచ్చెను. వారు వచ్చినప్పుడే వారిగానము చెవులపండువు సేసెను. వారు ముఖమున విభూతిధారణము కలిగియుండిరి. వ్రేలాడుదివ్వె (hanging lantern) దివ్యముగా వెలుఁగుచుండెను. వారు పరుండియున్న నాదు పాదములవద్ద నిలచిరి. వారిని నేను చక్కఁగా కన్నులుఁదెఱచి చూచితినికాని నేనులేచి కూర్చుండుటకుగాని నిలుచుండుటకుగాని పూర్వమే వారు తమ కటాక్షవీక్షణములను నాముఖమున ప్రసరింపఁజేయుచు "నీవు డెప్యూటీకలెక్టరువు అయినా అయ్యెదవు లేదా ఇప్లాగేయయినా యుండెదవు" అని నానిమిత్తమాత్రపు కర్మను ముగించువలం డులకై అట్లు భయపెట్టినట్లపెట్టి ఆశీర్వదించి అంతర్ధానమొందిరి."

7. మాగురువులవారుపొందిన ఉపదేశవిధము:—గురువులవారి తల్లిగారు 1904 వ సంవత్సరము జనవరిలో కాలధర్మమునొందిరి. ఏప్రిల్ నెలలో శ్రీరామనవమి భద్రాచలమునకు వెళ్లుదారి మధ్యమున ఏబదియరువది సంవత్సరముల వయస్సుగలవాఁడుగా కన్పట్టునొక సిద్ధపురుషుఁడు దగ్గరకు రమ్మనిపిలిచి నీకొకటి చెప్పెదను. భద్రముగా కాపాడెదవాయనెను. "చిత్తము" అని గురువులవారనిరి.

అంతట ఆసిద్ధపురుషుండు మాగురువులవారిని కన్నులు మూయుమనిరి. ఏమికనుపడెననిరి. మూడు సుందర బంగారు విగ్రహములని మాగురువులవారు చెప్పిరి. చూచితివిగదా! ఆవిగ్రహములు శ్రీసీతారామలక్ష్మణులు. చక్కగా మనస్సులోనిలిపి పూజించుచుండుమని చెప్పి ఆసిద్ధపురుషుండు వెళ్లిపోయెను.

N.B. రాజయోగసిద్ధిని జెందినవాండు సిద్ధుండనియు సిద్ధపురుషుండనియును సత్పురుషుండనియును చెప్పుదురు. ఇతండే యోగసామర్థ్యంబుచే పరమహంసయనియును చెప్పబడుచున్నాడు. ఇతనికి జరామరణములులేవు. ఇతండు ఉపదేశించినమాత్రమున సర్వమును తెలిసికొను జ్ఞానశక్తి కలుగును. (భాగవతము:—చతురసిద్ధాకృతి జ్ఞానమాదేశింతువు—ఇది వామనుని స్తుతించుట.)

ప్రపంచమే "మాయ" యనియును "ఎఱుక" యనియును చెప్పుదురు. నిన్ను కన్నులు మూసికొనుమని చెప్పి నీవుకోరిన ప్రపంచవస్తువులను నీలోపల నీకు చూపించువాండే పరమగురువు. ఆచూపెంచుటయే "ఎఱుకను" తెలుపుట. ఇట్టి పరమగురువువల్ల "ఎఱుక" ను తెలుపంబడిననేగాని జరామరణములనుండి విడివడవు. జరామరణములనుండి విముక్తియేముక్తి. చచ్చుట పుట్టుటకొఱకే. నిజము. నిజము. నిజము.

(వేణుగోపాలశతకము:—ఎఱుక చెప్పెటిగురుండు దొరకవలయు—దొరకిననే సరియా గురుపదములభక్తి గుదురవలయు.) అట్టి జరామరణములనుండి విముక్తిజెందినవాండు శరీరమును శాశ్వతముగా నిలుపుకొనంగలండు. కోరిన క్షణముననైనను శరీరమును అనాయాసముగా త్యజించి జీవసంబంధమగు తెలివియే రూపముగాగల పరమాత్మయందు ఐక్యముచేసి మోక్షమును పొందును. జీవసంబంధమగు తెలివిని అఖండాకారముగు తెలివియందు ఐక్యముచేయ నేర్పుకలుగనిది మోక్షములేదు.

అట్లు ముక్తిని పొందనేర్వని పురుషుండు స్వచ్ఛందమరణముండదు గనుక సంకల్పములను పెట్టుకొని శరీరమును త్యజించిన సంకల్పానుసారముగా జీవుండై పుట్టును. గురువులేక ఆత్మయందు ఐక్యముగ నేర్పు ఎవనికిని కలుగదు గనుక గురువులేనిదిమాత్రము మోక్షముకల్ల.

ఆత్మ తత్త్వమనియును మాయా తత్త్వమనియును రెండు తత్త్వములు గలవు. అందు ఆత్మ తత్త్వంబనునది పరిపూర్ణంబను పేరటను సఖ్యంబను పేరటను ప్రవర్తిల్లుచున్నది. మాయా తత్త్వంబనునది "ఎఱుక" యను పేరటను "రాజయోగంబు" అను పేరటను "ఆత్మయొక్క అంతర్గత్వం" బను పేరటను వ్యవహరింపఁబడుచున్నది. కనుక రాజయోగంబనునది యోగంబు కాదు. "ఆత్మయొక్క అంతర్తత్త్వమే" యని భావము.

ఈ "ఆత్మయొక్క అంతర్తత్త్వము" ను బోధింపఁబడినవాఁడు జరామరణములు లేనివాఁడై శాశ్వతుఁడు కాఁగలఁడు. సాంఖ్యమునమాత్రమే బోధింపఁబడినవాఁడు శరీరమున్నంతవరకు అమృతమును అనుభవించగలఁడే గాని మరణమును తప్పించుకొనజాలఁడు. అనఁగా ఇతనికి తిరుగాజన్మము కలుగబోదు. అనఁగా శాశ్వతుఁడు కాఁజాలఁడు. శాశ్వతుఁడుగానుండ సామర్థ్యముగలవాఁడొక్కఁడుఁడే ముక్తిని బొందినవాఁడుగాని తదితరులు ముక్తిని బొందినవారు కారని భావము.

సాంఖ్యమును తెలిసి జీవించియుండువారైనను అమృతమును అనుభవింపఁజేయు గలుగుట ఆత్మానుగ్రహంబున ఆత్మతో తాదాత్మ్యమును జెందిన వశిష్ఠాదులవలెనప్ప తదితరులకు వలనుపడదు. గ్రంథములవలన అద్వైతమును తెలిసినవాఁడు ఒకచో కూర్చుండి ఆత్మధ్యానము సేయుటను చూడజాలము. మరియు అమృతమును అనుభవించుటను చూడఁజాలము. ఆత్మను అమృతరూపమున ననుభవింప నేర్వజాలని వానికి మోక్షమదియెక్కడిది? లేనేలేదని భావము.

దేశకాలములచే బాధింపబడక ఎవఁడు ఏక్షణమందైనను తలంచినమాత్రమున ఆత్మను అమృతరూపమున ననుభవింపగలఁడో చిత్తశుద్ధిని పొందినవాఁడని చెప్పఁబడును. ఇట్టివాఁడు అనేకజన్మములయందు బ్రహ్మార్పణబుద్ధితో జేసిన సత్కర్మానుష్ఠానసిద్ధిని జెందినవాఁడగును. అట్లుకానియెడల ఒకేజన్మలో కొద్దికాలములో సాక్షాత్ఉపదేశకర్తచే సాంఖ్యముమాత్రము తెలుపఁబడి ధ్యానయోగసిద్ధిని జెందినవాఁడైనా యైయుండును. వీరుభయులును జీవన్ముక్తులేకాని శాశ్వతముక్తిని బొందినవారుకారు. అనగా వీరికి జన్మ కలుగక పోదు అని భావము. కాని అమృతానుభవము ఆత్మయొక్క ఆనందించుటయేగనుక ఆత్మానుగ్రహముగల వీరలు సహజముగా ఋణసంబంధముగానైన నిర్నిమిత్తముగానైన రాజయోగుల గృహములయందు బుట్టి "ఆత్మయొక్క అంతర్గత్త్వము" ను బోధింపఁబడి ముక్తులగుదురు. కాని ఎంతటివారికిని గురుపుత్రుఁడు కాకయే ముక్తినిబొంద వీలుపడదు. కనుక ఎల్లరును

అధికారులై మాగురువుగారివలన తత్త్వోపదేశంబునుపొంది ముక్తిని పొందుదురుగాక యని కోరుచున్నాను. "ఎటుల తెలుపుట" యనుమాటకే "నీవే బ్రహ్మమవుదని బోధించుట" యనికూడా అందుకు.

8. నాతండ్రిగారి మరణానంతరమున నావివాహకాలమువరకు:—

(*a*) నామనస్సుయొక్క స్థితి:—నాతండ్రిగారు 1904 సం॥ డిసెంబరు నెలలో కాలధర్మమునొందిరి. వశిష్ఠసందర్శనమాదిగా నాయందు ఆత్మవిలాసములు ఎడతెగక యుండుటచే ఆరోగ్యములేనివాడనయ్యును పిరికిని జెందకయుండి 1907 వ సంవత్సరము నవంబరులో అంతవరకు నాయందు అనుభవమైన ఆత్మవిలాసములు జ్ఞాపకమునకు తెచ్చుకొని షుమారు మూడునూరులుగా లెక్కించితిని. కనుక అస్థైర్యపడుటకు వీలులేని నేను "ఇట్లాగైనా యుండెదవు" అను వశిష్ఠుమాట కారణముగా వివాహము మానజాలనివాడను శాశ్వతకీర్తి కోరినవాడను డెప్యూటికలెక్టరు ఉద్యోగము చేసితీరవలెనను పట్టుదలగలవాడను నిష్ఫలములయ్యును శక్తివంచనలేక ప్రయత్నములు చేయువాడనుగాను ఉంటిని.

(*b*) మాయుభయులస్నేహము:—ఈశరీరముతో డెప్యూటికలెక్టరు ఉద్యోగము చేసితీరవలెను. పూర్ణఆరోగ్యము ఎట్లు లభ్యమగునని ప్రయత్నములుచేయుచు నేను 1905 వ సంవత్సరములో మాగ్రామమునకు 1½ మైలు వాయువ్యమూలముగా నుండు వడ్లమూడిగ్రామములో పాఠశాల చెప్పుచుండుటయును మాగురువులవారు మాగ్రామమునకు పశ్చిమమున ¾ మైలు దూరముననున్న శ్రీరంగపురములో ఉపాధ్యాయులవారుగా నుండుటయును సంభవించి ఆసంవత్సరము జులయి నెలలో పరస్పరస్నేహముమాత్రము లేనిదైనప్పటికిని స్నేహమమాత్రము అవుసరమనుట్టి తదాదిగా నీనిమిషమువరకును ఒకగడియయైనను ఎడతెగనిదై యున్నది.

(*c*) స్నేహమువలని లాభము:—మాగురువులవారు 1905 వ సంవత్సరములోనే జ్ఞానశక్తిగలవారై పెక్కుదివ్యౌషధములు కనిపెట్టుటయందును జరుగబోవు సంగతులు తెలిసికొనుటయందును జయశీలురై ప్రఖ్యాతిపొంది వారితోనైన పూర్ణ ఆరోగ్యము కోలుకైన వారియెడతెగని స్నేహముచేతను జ్ఞానవైరాగ్యములచేతను ఆకర్షింపబడి తొలి పెక్కు నిదర్శనములుకూడా యిచ్చియుండిరి. ఎట్టియెండవానలకును ఎట్టిప్రశ్రమములకును అలసటచెందని పూర్ణశరీరపటుత్వమును అనుగ్రహించుమన్నను వారా

సము చేసియుండిరి. అన్యుల నాశ్రయించిన డిక్కొంతటను కీర్తిచేని చుటుప రోగ్యమయిన దృఢశరీరము లభ్యముకానేరదని యెఱింగియుంటిని గనుక వారి యందే మనస్సు స్థిరముగా నిలిపితిని. వారు అనుగ్రహింప శక్తిగల సిద్ధపురుషుల గుటచేత అత్యంతఅవసరమై రహస్యముగాగాక బహిరంగముగా ఔషధమునివ్వవలెడ దగినకాలము సంప్రాప్తమైన అప్పటికి నిశ్చిదమేగాని అవసరము లేనప్పుడు ఇవ్వ కపోతే నేమియని ఔషధము నివ్వరైరి. వారు ఇంతవరకు ఇవ్వకపోవుటవల్లనే యిప్పుడు నేను చెడని యారోగ్యమును జరామరణరహితమైన ముక్తిని పొందగలు గుచున్నాను. కనుక వారిస్నేహలాభము మితిలేనిదైయుండును.

(*d*) 1905, 1906, 1907 వ సంవత్సరములు:—ఈమూడు సంవత్సరములలో చిన్మాత్రమగు ఆత్మస్వరూపము అనుభవదృశ్యము కాలేదు. మతియు నాశరీర మంతయు పరిపూర్ణమై శాంతమై అత్యంత సుఖకరమై కిందిదేహపు వర్ణమునందు తేజస్సునుగాని తెల్లని యమృతప్రాయమైన తేజస్సునుగాని నేను చూడలేదు గాని తదితరమునంతయును చూచితిని.

1905, 1906 వ సంవత్సరములలో మాగ్రామమునకు సమీపముననుండు వడ్లమూడి వెల్లలూరు గ్రామములలో పాఠశాల చెప్పితిని. నేను వెల్లలూరు గ్రామములో పాఠశాల చెప్పుచుండఁగా "ఏపరమేశు తేజమున నీసచరాచరమైన లోకము। దీపితమయ్యె నట్టి విభు తేజము కన్నుల జక్కఁ జూడఁగా। నోపక పారవశ్యమును జెందుచు సంస్థిమితాఖిలేంద్రియుం। డై పరమేష్ఠియై మఱచె నిక్కపు చిత్రపు రూపునై వడిన్"—పరమేష్ఠి యనుభవించిన నీయవ్యాప్తపదమును నేనును అనుభవించితిని.

1907 వ సంవత్సరములో నాలో అనుదినమును దృశ్యమగు అసంఖ్యాకములైన ఆత్మవిలాసములచే ప్రోత్సాహపఱుపఁబడి పూర్ణారోగ్యమును పొంది డెప్యూటీకలెక్టరును ఎల్లప్పుడును నాయందు ప్రపంచమేమియును కనుపడకుండునట్లుగా ఆత్మ ఆనందించునంతటి మహాస్థానిని కాఁజాలనేని ఉదరపోషణార్థమై నీచమైన కర్మలతో పనియేమిటియని నిశ్చయించి మాగురువులవారిగ్రామము జంపనికి వారమునకు రెండుసార్లకు తక్కువగాకుండునట్లుగా పోవుచు తదితర వ్యాపారములేక యుంటిని. మాగురువులవారు మహాప్రభావ సంపన్నులరయ్యెదరని నాకు అప్ప

వారిని ప్రార్థించితిని. వారు దానికి అంగీకరించి ప్రమాణములును చేయుచు వచ్చిరి. అందుచే వేధవ్యుఁడనుగా తలంచుకొనుచు తత్పూర్వము నేననుభవించిన బ్రహ్మ తేజస్సు మొదలగు వాటియందు మగ్న మనస్కుఁడనై యుంటిని.

9. వివాహము: ఉద్దేశము:— అనుభవించియుండిన సువర్ణ తేజస్సునందు మగ్న మనస్కుఁడనై దానినే కాంక్షించియుండియును జ్ఞానిని అనుసంగతి లోకులకు వెల్లడిగానిది వివాహముమానిన పలువురు పరిపరివిధములుగా తలంతురని తలంచి ఆరోగ్యముకొఱకును మోక్షముకొఱకును గురువులవారి ప్రమాణములయందు నమ్మకముంచి 1908 వ సంవత్సరము జనవరిలో వివాహము చేసికొంటిని. ఆరోగ్యముకొఱకు గురువులవారివలన ప్రమాణముతీసికొనియే వివాహము చేసికొంటిని. వివాహము చేసికొనునట్లు నిశ్చయించిన వారములోనే సూర్యోదయ కాలమున "రాజత్వమును వేదాంతసిద్ధియును అగును" అనియును ఆమరునాఁటి యుదయమున సూర్యోదయకాలమున "పార్వతీ పరమేశ్వరులిరువురును రావలెనని దగ్గరకువచ్చి ఇప్పుడు కాదులేయని వెళ్లిపోయినట్లును" స్వప్నములయ్యెను

10. 1908 వ సంవత్సరము: నందివెలుఁగుబడి: నా ఉద్దేశము:— వివాహానంతరమున పల్నాడు ఆప్రాంతమందు స్కూలుమేష్టరుగా సుమారు ముప్పదిరూపాయలకు పిలుపుతగిలినను మహాజ్ఞానిని డిప్యూటీకలెక్టరును కావలెనను కాంక్షతో తమపకారణముగా దివ్యమైన ఆరోగ్యమును పొందదలచియే ఏ నెలలోను పదమూఁడురూపాయలకు మించి దొరకని నందివెలుఁగుబడికి అలికియుంటిని.

భగవదుద్దేశము:— గురువులవారి వివాహము:— చిరాయుష్మంతుండును సజ్జనాగ్రగణ్యుఁడును దేవబ్రాహ్మణభక్తి సంపన్నుండును అగుపాఠశాల యజమాని కన్నెగంటి రెడ్డెమ్మగారి సహాయముననగాని 1912 వ సంవత్సరము చక్కగా గడువనేరదని నందివెలుగుబడికి నన్ను ఏర్పాటుచేయించెను.

1908 వ సంవత్సరము జూలయి ప్రాంతమునందు మా గురువులవారికి వివాహమయ్యెను.

11. స్వప్నము. సిద్ధపురుషసందర్శనము. ప్రత్యక్షసంభాషణము. సిద్ధపురుషుఁడని నిజము తేలుట.

1908 సం॥ ది ౮ అక్టోబరుతారీఖున రాత్రి "గుంటూరుకాలేజి పుస్తకదార పాని రూపమున సరస్వతీదేవి నాయొద్దకువచ్చి నాకిప్పుడేమియును జ్ఞాపకములేని పెక్కుసంగతులు ఒకగంటకాలము ప్రసంగించి తుదకు నన్ను పేస్ చేయవలెనని యున్నదియని తలయూపుచు పలికి అంతర్ధానమయినట్లును వెంటనే యొకహూణుఁడు శిరముపైని టోపిని చేతఁబట్టుకొని సలాము లొనర్చుచు చేరి పెక్కుసంగతులు ప్రసంగించి చనినట్లును" స్వప్నమయ్యెను.

తరువాత వారమురోజులకు నొకసిద్ధుఁడు నాయొద్దకువచ్చెను. ఆమహానీయుఁడు మల్లువస్త్రము ధరించి నిడుపగు నల్లని అంగీతో నెత్తిన పిల్ టప్పును కాళ్ల బూట్లును చేత గొడుగును కలిగి పెద్ద యుద్యోగస్థునిపాయా సవలంబించి యుండెను.

i. తెనాలిలో నేను భోజనముసేయు బసకువచ్చి నన్ను చూచుచునే దగ్గిర పిలిచి కూర్చుండుమని మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువు నన్ను "పేస్ అయ్యెదవు" అనిన నేను "ఏమోలే" యంటిని. దానికి ఆయన "కాదు, పేస్ అయ్యెదవు, పేస్ అయినతరువాతనయిన నన్ను నమ్మెదవా ? " యనెను మఱియు నేను తనవద్దలేని సమయములో నాస్నేహితుఁడగు నొకనితో "పరీక్షతప్పదు" అనెనఁట.

ii. మఱియు తనయందు భద్రకాళీ సరస్వతులు ప్రత్యక్షముగా కూర్చుండి తనను తమతో సమానస్నేహితునిగా సర్వవిషయములయందును ఆదరించుచుందురఁట.

iii. పిమ్మట మేము బసలో అందఱిలో కలిసి పరస్పర సమ్ముఖముగా కూర్చుండి భోజనము సేయునప్పుడు "నాలో విశేషము మాహ్లాదకమనియును మమ్ముకు చూపించుమనిన నెచ్చట చూపించగలననియును" భద్రకాళీ సరస్వతులు తనవనిరనియును, నాతో చెప్పెను.

iv. భోజనానంతరమున వేర్వేరు కాలములయందు "నేను వేదాంతినేనా ? " యని యడిగితిని. "అవును" అని ప్రతితడవను జవాబిచ్చెను.

v. చాంచల్యములేక వేదాంతినిగా నిలువగలనాయని యడిగినప్పుడు మూడవపర్యాయమున "నిలువఁజాలవు" ననిరి.

vi. మరల తమదర్శన మెప్పుడని నేనడిగిన "మూడుసంవత్సరములకు" ననియె. మిమ్ము నమ్మజాలనంటిని. "కాదు, సరస్వతియే యనుచుండె" ననె.

vii. పెక్కుదినముల బడితినంటిని. మంచిరోజులు వచ్చుచుండె ననె. ప్రైవేట్ బడి చెప్పుచుందువనియె. విధివ్రాత యట్లుండగా బోలునని దుఃఖించిని.

viii. మఱియు నన్ను గూర్చిన సంగతులు తనను గూర్చినట్లు ఇట్లని పలికె:—

"ఇఁక నాలుగుసంవత్సరములకు చచ్చి దేవతలలో నొకఁడనై పుట్టెదను. దేవతలలో పుట్టవలసినవాఁడను మనుష్యులలో పుట్టితినని దేవతలు నన్ను చూచి నవ్వుచుందురు. నేను వారలను చూచి నవ్వుచుందును. లక్ష్మీదేవి నాయొద్దకు రావలెనని వచ్చుచుండును. సరస్వతీదేవి నీవు లేనిది యిక్కడ జరుగక పోవునదేమియు లేదని వెడలగొట్టుచుండును."

మఱియు నేనము చెప్పి కవిత్వమునందాశుధారను చూపి అంతయును భద్రకాళీ సరస్వతులే యని గడచిన రెండుశ్రోత్రియజన్మముల సంస్కారము పూర్తికి కొంచెము తఱుగై నిలిచియున్నదనియు కన్నులయందు జ్ఞానము కన్పట్టుచున్నదనియును పలికి మనము దేనినైనను కొనునప్పుడు మంచివస్తువే నాయని యెంతయో పరీక్షించు విధమున దేవతలు మంచివస్తువే నాయని పట్టిచూచెదరు. ఆగునెడల తగు సహాయముచేయుదురని చెప్పి పెక్కు పరీక్షలు పేస్ కావలసియున్నావు. అందు కొన్నింటిలో మొదటితరగతిని పేస్ అయ్యెదవని చెప్పి చనియె.

"ప్రస్తుతపు కాళిదాసును చూచితివా" యని యొకానొక స్నేహితునితో ననిన అతఁడు "నక్కయెక్కడ, దేవలోకమెక్కడ" ననె. అంత నేను వివరించి నొక్కిచెప్పగా నమ్మజాలక అతఁడు శనివారము రాత్రి యెనిమిదిగంటలకు తదేకనిష్ఠగా వాంఛసేయపూజ సేయుచుండిన హనుమదుపాసనపరురాలగు తనతల్లిగని మనస్సులో తలచినది చెప్పుమనియె. అంతనామె "ఇట్టివస్త్రములలో నొక పురుషుఁడు కంటికి కనుపడుచున్నాఁడు. కొద్దిరోజులక్రిందట నిక్కడకు వచ్చెను. అతనికి సరస్వతి సిద్ధియయ్యె. ఇఁక నన్నడుగకుము" అనియె.

12. గురువులవారు పరీక్షలో "పేస్ అయ్యెద" వని చెప్పుట:—1908 సం॥ డిసెంబరు ప్రథమవారములో మెట్రిక్యులేషన్ పరీక్ష జరిగెను. పరీక్షకాగితములు

వెల్లడియైనవిషయము సభిప్రాయముతో ఫేస్ అయినవారలకు మరల పరీక్ష శీఘ్రవరిలోజరుగునట్లు వార్తాపత్రికలలో ప్రచురింపఁబడెను. ప్రథమపరీక్షలో ఫేస్ అయ్యెదనో లేదోయని సందియంబు పొందియున్న నన్ను తెనాలిలో కలిసికొని తాను నేను పరీక్షలో ఫేస్ అయ్యెదనో కానోయని శ్రీరామచంద్రులవారిని అడిగెనయును అందుకు శ్రీరామచంద్రులవారు "నీసంగతే నా విచారించుకొనుము. ఇతరులసంగతి నీకెందు" కని యనఁగా కాదు చెప్పుమని నొక్కియడుగ శ్రీరామచంద్రులవారు లక్ష్యముమీద "నన్ను తెల్లటియేనుఁగు నెక్కించి" చూపుచు తనపాదములవద్దనున్న హనుమంతునిచూపి యితనిని తగువిధముగా నారాధింపుమనిరఁట. అంతట మాగురువుగారు ఆసంగతి యావత్తు నాకు తెనాలిలో చెప్పిరి. వారుచెప్పినట్లే ప్రథమపరీక్షలో ఫేస్ అయితిని. ద్వితీయపరీక్షయందు అపజయమునొంది భద్రకాళీ సరస్వతులమాటలను శ్రీరామచంద్రులవారిమాటయును వ్యర్థంబయ్యెఁగదా! నిర్భాగ్యులను వారును సంరక్షింపజాలరనియే తలంచితిని.

13. పరీక్షతప్పుట. దుఃఖము. గురువులవారు హితవాక్యము తెల్పుట. రాత్రిము. లాభము. భావికాలస్థితిస్వప్నము:—పరీక్షతప్పితిని. ఆహా ఎంతకష్టము! బ్రహ్మాండభాండములయందు అణుమాత్రమైనను ఆత్మగానిది లేదుఅని ప్రత్యక్షలక్ష్యములచేత చూపింపఁబడి ఆత్మయే జగద్రూపమున కన్పట్టుచున్నదని ప్రత్యక్షలక్ష్యములచే చూపింపఁబడి పుట్టుకయే లేదని ప్రత్యక్ష లక్ష్యములచే చూపింపఁబడి కనుక నే తల్లిగాని తండ్రిగాని అన్నదమ్ములుగాని శరీరముగాని లేదని ప్రత్యక్షమున దర్శించి నిర్మోహుఁడనై ప్రపంచము కనుబడకుండునంతటి పూర్ణముగాకూడా ఆత్మను హృదయపద్మమునందానందించుచుండునట్లుచేయ నుత్సాహపడిన నాకీవివాహమెక్కడసంభవించె! ఎవరికోరిక! కోరితినిపో పరీక్ష ఫేస్కారాదా! ఇట్టి తెలివిహీనుననసు నష్టిదికూడానా! అకటా! ఎవరురక్షింపువారు. దరిద్రుఁడనే. పోనీ, దిగులేటికి? ఎచ్చోటనైనను 15-0-0 లు తెచ్చుకొని జీవించరాదా? అట్లయిన చిన్ననాటనుండి విద్యచెప్పించి నాకొఱకై ఎంతయో ప్రయాసపడి దిక్కు ఎవరునులేని కాట్రపాటి సుబ్బయ్య తాతయేమికావలె? పెక్కుసంవత్సరములు పోషించిన సందమ్మ నాయనమ్మ యేమికావలె? జ్ఞానినైన యేను ఎట్లు వీరినివదలి భుజింపఁగలను? ఏమిచేయవలె? ఎయ్యది తెరువు? కష్టా! తీరనిదుఃఖమ్ము ఆయెఁగదా. కానిమ్ము.

నామీదప్రేమ శ్రీరామమూర్తి కొకవేళ లేకపోవచ్చును గాని తనభక్తుఁడగు మాగురువులవారికైన నేలలేకపోవును. వారిమాటననాదరించునా? అనాదరింపఁడు. కనుక నాకేమిగతికానున్నదో తెలిసికొని చెప్పుమని వేఁడెద. తప్పక చెప్పఁగలఁడు. అని నిశ్చయించి లేఖనమొండు వ్రాసితి మాగురువులవారు నాకోరినవిధమున శ్రీరామచంద్రులవారిని అడిగి నారాయణకేమిగతి కానున్నది తెల్పుమనెను. శ్రీరామచంద్రులవారు ఇట్లనిపలికిరి: “ప్రాణనిర్యాణదశచేత శూన్యముఅయితే పరిపూర్ణానందము. యోగానందప్రాప్తము. తత్సాంప్రదాయాధికారములవల్ల సంప్రాప్తమై శాశ్వతసుఖానందమొందఁగలఁడు.” ఇదివారు వెంటనే లేఖనము వ్రాసియుండిరి. ఆలేఖనము ఇప్పటికిని నాపుస్తకములలోనుండి యుండవచ్చును. ఉండునెడల వలయు వారలకు చూపించెద.

తరువాత త్వరలోనే సంపాదనప్రయత్నోన్ముఖుఁడనైతిని. కాలగతి వేఱువిధమున నుండినట్లు తోచక కాదుగాని మాతమ్ముని ప్రోత్సాహమునుబట్టియును నాదు చిత్తశుద్ధికొఱకు ఎండమావుల వెనువెంట తగులుపగిది వృథా ప్రయత్నములు సేసినవాఁడనైతిని. పదునైదురూపాయల యుద్యోగంబది చాలనిదికాగా దానికి అదియును దొరకమి తోడ్పడుటచే కాలవైపరీత్యంబున కాశ్చర్యంబును విషాదంబును జెందితి. కాని జ్ఞానబలముచే స్థైర్యశీలుఁడనై యిట్లనియోచించితి.

కానిమ్ము. దైవోద్దిశ్యమ్ము తప్పింపరాదేకిని. ఎయ్యది కావలయునది కాకపోదు. భయంబేటికి? చూపించెద వేదాంతతీవ్రంబును. అకటా నెమ్మదిగఁ కాలంబున కీర్తివంతంబగు వేదాంతతీవ్రంబు కష్టకాలంబున వాడిన కష్టకాలపు వైరాగ్యమందురుగాబోలు. ఏమిచేయవచ్చు! కానిమ్ము. కాలము శాశ్వతమా? సుకాలము కలుగదా? అప్పటికి తెలియరా? అని నిశ్చయించి వశిష్ఠోపదిష్టంబులును జగన్మిథ్యాత్వనిర్ణయకములునగు వివిధలక్ష్యంబుల మనంబుననిల్పి లక్ష్యబలముచే అవిద్యను తిరస్కరించి ఇఁకమీద నన్నెవ్వరదిరింపనోపుదురని రూఢేక్షుఁడనై భూమిగంధము వీడినను ఉదకము ద్రవత్వరహితమైనను అగ్ని శీతలమైనను కావచ్చునుగాక నేనుమాత్రము ముగించనిది వెనుకకు తిరుగనని ప్రతిజ్ఞపూని గుంటూరుడిస్ట్రిక్ట్ జడ్జి టి. టి. రంగాచారిగారికై పునకు లేఁగితిని. కష్టకాలంబున ఓర్పుపూననిది జయముకలుగదని ? రహస్యలేఖనము (Confidential letter) అనుపేర నావి

మయమైన సర్వంబును తెలుఁగున లిఖించి పోస్టుద్వారా నివేదించితిని. వ్రాయు నప్పుడెడతెగని యమృతసారివముచే శుభసూచకమనినమ్మి మఱింత ప్రోత్సాహప ఱుపఁబడితిని. కాని లేఖనమువలని ప్రయోజనము శుభమునైనను మొగ్గకనపడ లేదు. కనుక మఱల లేఖనము వ్రాయఁబూని యింగ్లీషున నివేదించితిని. ఇది వ్రాయునప్పుడును ఆత్మ ఆనందించుచుండెను. ఈలేఖనమున నన్ను గుణముల హరిశ్చంద్ర ధర్మజ విక్రమార్కాదులకును నిర్గుణమున పరమభాగవత శిఖామణుల కును తీసిపోనివానిఁగా చెప్పికొనియుంటిని. లేఖనముయొక్క ప్రయోజనమేమని యునుమాత్రము తెలుపఁబడలేదు. రాత్రి నిద్రపోయి తెల్లవాఱుజాము అయిదు గంటలకు "నేను మాయింటిగొడ్డిలో కట్టుమట్టితో సహా తెముగుకొను నావు నొకదా నిని పట్టుకొనవలెనని వెంబడించినట్లును అదిచిక్కక దొడ్డియంతయును త్రిప్పిత్రిప్పి తుదకు వాకిలిన తప్పించుకొని పోయినట్లును" స్వప్నము వచ్చెను. వెంటనే నేను లక్షించి స్వప్నార్థము జరుగబోవునదియని తెలిసియు ధీరత బోవాడక లేఖనము పోస్టులో వేయుందలంచి అది నెట్టినకోటకు వెళ్లితిని. కాని కన్నులు మూతబడి తెరిపిడిబడవయ్యె. ఇట్లు అనునిమిషములకాలము ఉండెను. కాని యీసంధ్య మున దక్షిణనేత్రమున చిత్తను సూర్యుఁడుదయించి మనమునందలి తమమును బాపి ఎన్నటికిని మరువరాని సుఖార్ధనిముంచి అస్తమించెను. ఇదంతయు నిజమునకైనన్లే భావసూచకంబని యూహించితిని. ఉత్తరము చేతబట్టి తెనాలి పోస్టులో వేయ నుద్యమించి బయలుదేరితిని. దారియంతయు చిత్తను వెన్నెలవెలఁగి మనంబున జగ ద్భ్రమరూపమగు కటికచీకటిని నశింపఁజేసి సుఖమును కలిగించె. కాని యిట్టి పండువెన్నెల పోస్టులో ఉత్తరము వేయునప్పుడుండిన మనకార్యము సిద్ధించుట నిశ్చయమని తలంచితిని. కాని పోస్టాఫీసు ఒకఅరమైలు దూరముండఁగనే వెన్నెల నశించినది. ఉత్తరము వేసినప్పుడు ఆత్మ ఆనందించలేదు. కనుక శుభంబు కలుఁగఁబోదు అని తలంచి ఆవిద్యను పూర్తిగా తిరస్కరించకయుండును. లేపన్న పరమాత్మ యేలసంతసింపఁడని నిశ్చయించి యుత్తరము పోస్టులోవేయునప్పుడు ఆత్మ ఆనందించకయే నాలేఖనపనిని మానసని సాక్ష్యనిర్ణయకములగు వశిష్ఠోపదిష్ట లక్ష్యంబులను బాణములచే అవిద్యయనియెడి శత్రువును నశింపఁజేసి యుక్తిగా నమ్ము తోపమానుఁడనగుచు దశమదివసగళ్యనధులతో భిన్నకాలంబుల జడ్జి టి. టి. రంగా చారిగారికి ఉత్తరములు లిఖించితిని. ఈయుత్తరములన్నియు వ్రాయునప్పుడె పుడును అన్నూకునిజేయుచుండెనుగాని యేలేఖనాంతమందును శుభప్రదమని లక్ష్య

ముమీద తెలియదచెప్పె. కాని ప్రతియుత్తరమును పోస్టులోవేయు తలంపుతో నస్యాగ్రిమమునకు బోవుచో మధ్యమునందంతయు చిత్తము పూర్ణిమవెన్నెలనుండి నిరతిశయసుఖాగ్ర్య నిమగ్నత పొందింపుచుండి పోస్టులో లేఖనపతన కాలంబునందు సత్వాగ్ర్యమునందు ఆత్మప్రకాశత నశింప ప్రయోజనము కల్గదని తోపించె. అట్లగుటంజేసి యుద్యోగవిలుకొలుక్కైన ప్రయత్నము ఎప్పుడో అదివరకే నశించి ఆత్మను ఆనందింపజేయుటకు యుద్యోగయనిమాత్రము మనమున దృఢముగానాటె. కనుక ధర్మముకొఱకు కామమును ఆత్మకొఱకు ధర్మమును వదలినను దోషములేనిది యగుటయును శాశ్వతకీర్తియుండవలె కాంక్ష బహుసంవత్సరములుగా స్థిరమై జ్ఞానముచే పోషింపబడి బలిసియుండుటయును కారణముగా కడపటి రెండవయుత్తరములో అగ్ని చల్లనైనను సూర్యచంద్రాదులు గతులుతప్పినను నేనుమాత్రము వేదాంతధర్మమునవే యవలంబింతును గాని తదితర ధర్మముల నవలంబింపనని వ్రాసితిని. మఱియు (I shall challenge both kings and philosophers practically) అనియును వ్రాసితిని ఈయుత్తరమునకును ఆత్మ ఆనందించలేదు ఏమిరా ద్వైతమాయని మోహమయంబగు ప్రపంచంబును తత్స్వరూప నిర్ణయకములగు అనుభవలక్ష్య జ్ఞానాగ్నిచే దహింపజేసి పొందవలసినదిగా ననుభవించియుండిన యమృతపదంబునందలి కాంక్ష పెచ్చు పెరుగంగా కడపటియుత్తరంబు నిట్లువ్రాసితిని:—

"May God save me from the disgrace of failure! May Saraswati bless me with making her efface the word 'fick'eness'! I shall defeat both kings and philosophers practically. I don't like that there should be a more virtuous person than myself. I shall promise you whatever you want."

మఱియు ప్రపంచము లేదని తెలిసినను తనను గుణప్రవర్తనముమాత్రము పతనమాత్రముగ సంగతి కాదు తలంచి "Though the sun and moon should leave their orbits; though the fire should become cold; though the sky should fall to the ground I don't utter falsehood; for so much at least I can dare say I can guarantee" అనియును వ్రాసితిని. లేఖనము వ్రాయుట ముగిసెను. పూర్వపు లేఖలముల యొక్క యంతమందువలెగాక యీలేఖనాంతమందు శుభాశుభద్వయము ఒక్కొక్కటి కించిత్తయ్యును శుభమయ్యే పున మొగ్గగలిగి లక్ష్యముమీద కనుబడెను. ఈశుభాశుభద్వయము ఇప్పటికి నేననుభవించుట ప్రాప్తియాయనది. అట్లు లక్ష్య

ముమీద కనుబడుటచేత మొత్తముమీద శుభమని నిశ్చయించితిని. సరస్వతీదేవియును నేను పరీక్ష ప్యాస్ అయితినని యును ఇతర బ్రహ్మాదులును నన్ను గెలువరాని విధమున తాను నన్ను పట్టుకరాగలుగునని యును సంతసిల్లెను. ఈలేఖనమును రాత్రి యొనిమిదిగంటలవేళ వ్రాసితిని.

తెల్లవారి రైయైదుగంటలకు నేను కటియందు తడివస్త్రముకలిగి పైవస్త్రములేక ఆపాదమస్తకముగా తడిసి తుడువఁబడక జలబిందువులు స్రవించు శరీరముతో రెండంగజములకు మించిన పొడవును రెండుఅడుగులకు తక్కువగాని వెడల్పునుగల యొక కొయ్యతెప్పమీద కూర్చుండి యొకఫర్లాంగు చతురముగలిగి పడ్డుననుండి నీటిమట్టమునకు యావత్తు కాలమున బురదగా కన్పట్టి నడుములవరకు లోతుగల బురదనీళ్లుగల యొక్క కాలమున యొకదిక్కునుండి మఱియొకదిక్కునకు కటివస్త్రముగల యొకశూద్రునిచే నెట్టుకొని రాబడి దరిజేరినయప్పుడు ఆశూద్రుఁడు వెంటనే చూచుచు కొయ్యబల్లను రెండుహస్తములతో పైకియెత్త నేను పూర్వమువలె కూర్చుండక నిలచి ప్రాణాపాయకరముగా భూమిమీద పడబోవునంతటి భయముతో నాకు నేస్వాధీనముతప్పి అటునిటు తూఁగులాడుచు శూద్రునిగమన వేగమున కాలునకు నాలుఁగింతలగు నీభూప్రయాణంబును తృటిమాత్రవగడపి నిశ్చట సర్వవిధముల పూర్వపుకాలను ప్రయాణమువంటి ప్రయాణము నొండొకటిచేసి దరిజేరినట్లుగా స్వప్నమయ్యెను. ఈస్వప్నము 1909 సం॥ ది 1 అక్టోబరు ప్రాంతమందు కలిగెను. సమస్తజీవమయుఁడగు నీశ్వరుఁడు దేశకాలక్రియలనియెడి శక్తుల సహాయమున జగత్సృష్టిస్థితిలయములు సేయువాఁడగుటంజేసి సమస్తశక్తులలోనైన తాను దేశకాలములుకూడ చేయఁదలంచినపనిని తెలియఁజేసె. సమస్తముతానై సమస్తమునకు వేరైన యయ్యీశ్వరుఁడు జగత్స్వరూపుఁడైయుండ కించిత్స్వప్నరూపుఁడగుట యేమివింత! శూద్రుఁడు బల్లను చేతులతో పైకియెత్తగా నేనులేచి ప్రాణాపాయకరమగునట్లుగా భూమిమీద పడుదునేమోనని భయమందితినిగాని నీశ్వరకల్పనయేయగు నీభువనమున వృథా భయంబేకాని నిజముగా పడిపోవు టెవ్వఁడొకఁడుండునా? స్వప్నమునందు నేనుకూర్చుండిన బల్లయే జగదుత్పత్తిస్థితిలయములౌ జగద్ధర్మము. బల్లను నెట్టిన శూద్రుఁడు మాగురువులవారే. స్వప్నము 1909 స॥ ది 1 అక్టోబరు ప్రాంతఃసుదున కలిగెను. స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవము 1911 సం॥ ది 15 అక్టోబరు ప్రాంతమందు ప్రారంభించి 1912వ సం॥ ది 15 నవంబరులో ముగిసెను.

అట్లు స్వప్నము కలిగినవెంటనే లేచితిని. స్వప్నము భావికాలస్థితిని తెలియఁజేసెడిదిగా నిశ్చయించితి. లేఖనము పోస్టులో వేయఁదలంచి పెట్టెసమీపించునప్పుడు వెచ్చని యాత్మతేజస్సు మనస్సును సుఖమగ్నత నొందింపుచు దక్షిణనేత్రములో నుద్భవించి మనోమగ్నతచే ఆపాదమస్తకముగా శరీరము నిర్మలసుఖానుభూతి నొప్పారఁగా లేఖము చేతనంది పేటికపైనిడి యెద్దియో సవరించు నాయందు చిన్మాత్రుఁడమృతసాంద్రుఁడగుచు మనసు సుఖాబ్ధినిలచి నివాతదీపకళికభంగి సర్వసంకల్పములువీడి జాగ్రత్స్వప్నముల నతిక్రమించి బాహ్యవస్తు ప్రతిభాసములేక తెలివిమాత్రమై యుండెను. శాంతమై సుఖకరమై పరిపూర్ణమగు కించిదెఱుపగు నాత్మతేజస్సు దక్షిణహస్తమును మణిబంధమువరకునిండి మరువరాని సుఖస్థితిని పొందించెను. మణిబంధమాది జంఘపర్యంతము శాంతమై వికార రహితమై పరిపూర్ణమగు తెల్లటి యాత్మతేజస్సునిండి కొంచెము తక్కువగు సుఖస్థితిని పొందించెను. లేఖనమున నెద్దియో సవరించుచుంటిని. ఆత్మతేజోవ్యాపకమున హస్తము స్పర్శాభ్యాసంబునకు యోగ్యము గాక నిర్వికారమై కేవల తేజోమాత్రమై యొప్పి నిరతిశయసుఖమును కలిగించెను. అట్టిసమయమున విశ్వాతీతుఁడగుటచే విశ్వసంబంధముగానే సంకల్ప వికల్పములును లేని యీశ్వరుఁడు మనోభావమును పొంది నేననుకొనినట్లీశ్వరుఁడనంచు పలికె. అట్లు యుక్తిగా నీశ్వరభావమును పొందిన యేను స్వయముగా హస్తమునందు కమలరేఖను సృష్టించుకొంటిని అక్కమలరేఖ తదాదిగా నేఁటివరకు నాముఖవర్చస్సునుబోలి లోకకళలతో పైకి తెల్లనై యున్నయది. సవరణానంతరము లేఖనము చేతఁబట్టుకొని పోస్టులో వేయుతలంపుతో లేచితిని. అంతప్రభువగు చిన్మాత్రుఁడు తన యథార్థస్వరూపమును చూపి సమస్తేంద్రియాతీతుని జేసి నేనుపల్కినవిధముగా మనోభావమును పొంది దిక్కులంతటను పూరింపఁబడిన వాఁడనంచుబలికె. సర్వశుభసంగ్రహంబగు ప్రభుదర్శనంబున వాసనాత్రయమూలంబగు భ్రమవీడి ఆయనిమిషముల కాలమున్నతటి జగదుత్పావనబుద్ధితో నవియివియని చెప్పి చూపించుచు నీశ్వరుఁడు నాయందు మనోరూపుఁడయ్యెను. అట్లు జీవుఁడనైన నాయందు ఈశ్వరుఁడు చెప్పినట్టి చూపించునట్టి మనోరూపత చెందినది వాసనాత్రయ రహిత యమృతస్వరూప సాంద్రమాత్రుఁడనైన నాయందు జగత్ప్రభురూపమగు మనస్సు స్పష్టముగా బుట్టి పెరిఁగి

వశించెడిసని బోధించుట కొఱకే గాని నన్ను అవ్యక్తస్వరూపసాంద్రమూర్తుఁడనుగా జేయక కేవల దృశ్యస్వరూపజీవమాత్రుఁడనుజేసి వశింపఁజేయుటకుగాదు. మఱియు బ్రహ్మమునంచును సర్వము నేనంచును నేను పలికినట్లు పలికె. ఉత్తరమును పోస్టులో వేయుటకు నాలుగుమైళ్ల దూరమునన్న చేబ్రోలుగ్రామమునకుబోవు యా వత్తు దారినను బ్రహ్మస్వరూపసాంద్రుఁడనైయో దట్టమగు నవ్యక్తసర్గ మధ్యమునను జాగ్రత్స్వప్నముల నేర్పరించ రాకయుండి సుఖించితిని. పోస్టులో ఉత్తరము వేయునప్పుడును ఎప్పటివలెకాక ఆత్మ యానందించెను. అందుచే నేను కృతార్థుఁడనైతినని నిశ్చయించితిని. మరలి స్వగ్రామమునకు వచ్చునప్పుడు ఆత్మ ఆనందించుచు నేయుండి మఱువరాని సుఖస్థితిని పొందించెను.

14. శివశక్తి. ఔషధము:—అనంతరమున గుంటూరు చేరితిని. మాపినతాతభార్యయగు పోచిరాజు నందమ్మగారి గృహమున సుఖభోజనము సేయుచుంటిని నేను లేఖనములు వ్రాసికొనియుండిన జడ్జి టి. టి. రంగాచారిగారిని దర్శించవలెనని సంకల్పించితిని. ఆరోగ్యమూ బాగుండలేదు. లేఖనములయందు వ్రాసినదియూ తపోవంతులకును జ్ఞానవంతులకును నసాధ్యమగునది. వ్రాసినదియూ ఆత్మ సంతోషించుటకొఱకు గాని ఉద్యోగముకొఱకుగాదు. జడ్జిగారిని దర్శించకుండుదున్న కార్తాపత్రికలయందు ప్రమాణమునేమో. దర్శించెదనన్న వ్రాసినవిధమున నిర్వహించగలవాఁడని యడుగునేమో. చాలనన్నట్లయిన నేలవ్రాసితివనునేమో. చాలుదునన్న నిర్వహించజాలను. మఱియెవ్వఁడనేని వారించి సుఖజీవన మొనర్పరాదాయన్న జ్ఞానినిగనుక అట్లు చేయనుజాలను. జ్ఞానములేకన పోలేదు. ఉండిప్రయోజనములేదు. కాని యెట్టకేలకు జడ్జిగారిని దర్శించెదనని దృఢనిశ్చయముచేసికొంటిని. కాని ఆరోగ్యము లేమికల్లగదా మూఁడుదూరవలసివచ్చెనని దుఃఖించితిని. వశిష్ఠసందర్శనమాదిగా పెక్కువర్షములు భక్తిపూర్వకముగా ప్రపంచము లేదను దృష్టితో నఖండకీర్తినికామించి ఘోరతపంబుసేసిన యేను తుదకు వ్యర్థుఁడను కావలసివచ్చెగదాయని దుఃఖించితిని. అట్లు దుఃఖించియు కానున్నది కాక మానదను నిశ్చయముతో జడ్జి టి టి. రంగాచారిగారిని దర్శించ నుద్యుక్తుఁడనైతిని. జడ్జిగారును నేను కనుఁబడిన నేదియో యొక యుద్యోగంబియ్యవలెనని యుండిరి. కనుక నేను జడ్జిగారిని దర్శించిన కానున్న కార్యమునకు భంగముకలిగి గోటమీటిన బోవుపనికి గొడ్డలితో పనిగల్గునంతటి కష్టమ్మ

దొరకొనునని భద్రకాళి నిశ్చయించె. అట్లు నిశ్చయించి లయశక్తియగు భద్రకాళి తనశక్తిచేత ఆరోగ్యమును మఱింత క్రుంగదీసి దారుణమును పెంచె. స్థానికగుటవలన గలిగిన రౌద్రము, మనమున విశ్రమములేమి, వేసవికాలము, దారుణపుసెగలుకూడి భద్రకాళికి తోడ్పడె. అంతనేను మఱింత దీనుఁడనై స్థానము చేరుద్రుఁడనై గడువరానికాలమునకు బద్ధుఁడనై జడ్జీగారిని సందర్శించు నుద్యమమునువదలి గురువులవారిని సందర్శింప వారిగ్రామమునకు వెళ్లితిని.

అప్పటికి వారమురోజులక్రిందట మాగురువులవారు నిమీలితలోచనులైయున్నతఱి నిర్నిమిత్తముగా "ఆదినారాయణ కడుడస్సియున్నవాఁడు డవ్వౌషధమొండతనికినిచ్చిన బాగయుండునని తోఁచెడిని. ఔషధమిట్లు చేసియిచ్చిన లెస్సగానుండునని ఔషధక్రమమును తానెవ్వరైనది తెలియఁబడకుండఁజెప్పి" భద్రగాలిపనిరి. అట్లు మాగురువులవారి సందర్శనమునకుబోయి వారితో నాశరీరస్థితిని తెలియఁజేసికొని ఔషధముకొఱకు నేను ప్రార్థించితిని. వారు నాప్రార్థన నంగీకరించి ఔషధము నిచ్చెదనని చెప్పుచు జరిగినసంగతిని నాకు దెల్పిరిగాన తెలియఁగలిగితిని. గురువులవారు ఒకమండలమురోజులకు సరిపోవు నౌషధము నిచ్చిరి. అదిసేవించిన యనంతరమున రెండుమాసములకు సరిపోవు నౌషధమును నేను ప్రార్థింపగా నిచ్చిరి. అల్లౌషధసేవచే శరీర దారుణము తగ్గిన సొకవిధమున సుఖమును పొందియు నెప్పటివలె సాక్షాత్కృత్యములచే ప్రస్తుతమున నమృతానుభవము సేయించి క్రమమున సర్వవిధముల నీశ్వరసామ్యునిజేయు సర్వశుభాకరహంబగు భక్తియోగంబు సేయనేరమి దుఃఖ వధికమగుదు యవ్వన భాగ్యమున కాంక్షవిశేషము కల్గినవాఁడనైతిని. కాంక్ష సేయుటయేగాని యిచ్చువారొకరును ఉండరుగదా. అభ్యాగతియొకఁడు రెండుజాములకు మనగృహంబునకేతెంచిన నెట్లో భోజనంబిడి వెంటనే సాదరంబున సాగనంపుదుముగదా. ఇట్టిగతియే ఆయుకర్షములుగా యవ్వన భాగ్యకాంక్షచే కేవలమభ్యాగతివృత్తినిపొందిన నాకును సంప్రాప్తించె. అల్లౌషధము నిచ్చినవెనుక నాలుగుమాసములవఱకును మరల నౌషధము నియ్యఁడయ్యె. స్థానము తగ్గనిదయ్యె. భక్తియోగము జరుగనిదయ్యె. జడ్జీగారిని దర్శింపరాదయ్యె. దర్శింపక యన్యుల సేవింపరాదయ్యె. జడ్జీగారు నన్ను ప్రేమించునను భరంబును విడువనిదయ్యె. అవమానము పొందకున్నదియని తోఁచనిదయ్యె.

15. నందివెలుగుబడి. ఔషధము. తమ్ముని వివాహము. సంవత్సరాది పండుగ. గురువులవారికష్టములు: దేవమాహాత్మ్యము. గురువులవారికి నిద్యోగవట సంతోషము. గురుపూజ. కార్యము:—అట్లు తోచియు చేయునది లేక యూరకయుంటిని. ఇట్లుండ నంది వెలుగు గ్రామములో స్కూలు మేష్టరుపని ఖాళీ వచ్చెను. పూర్వము 1908 వ సంవత్సరములో ఆ గ్రామములో నాకలవ తన కొమాళ్లకు విద్య చెప్పించుకొనిన కన్నెగంటి రెడ్డెమ్మగారను కమ్మకులోద్భవుండొక్కరుండు నాయందలి ప్రేమచే మాకలవాడు కబురుపంపెను. గురువులవారివలన ముక్తిని చెడని యారోగ్యమును పొంది పిమ్మట బక్షీగారిని సందర్శించి వలయునేని వ్రాసినట్లు నిర్వహించెదవని కంకణము కట్టుకొనుదును గాక యని ప్రస్తుతమున బడికి సమ్మతించితిని.

ఎంతగా జ్ఞానవైరాగ్యములుండెనో ఎంతగా నెల్లవిధములు నీశ్వరసాన్నిధ్యముకావలెనని యుండెనో యెంతగా కీర్తియందలి కాంక్ష నిలచియుండెనో యంతగా ముక్తికొఱకును చెడని యారోగ్యముకొఱకును గురువులవారికే తిలో కిక్లిష్టైతిని. అట్లు బడికి సమ్మతించి యౌషధము నిమిత్తమై గురువులవారితో అకుకల్లూరు గ్రామమునకు వెళ్లితిని. అచ్చటను నేను మాగురువులవారికి "నేను మీకు శాశ్వతకీర్తి నిత్తుదలచియున్నాను. మీపాదములను పుష్పములతో పూజింపదలచియున్నాను. మంచి యౌషధమును నాకనుగ్రహింపుఁడు" అని లేఖనము వ్రాసితిని. ఆకారణమునను నిజమునకట్లే జరుగనున్నదియనియును సిద్ధపురుషుఁడగుటచేత తెలిసికొనియుండెను. గనుక మాగురువులవారు నేను లేఖనమందు వ్రాసినట్లు జరుపనిది ఇఁక మీదట నిల్వబోవునది లేదని కడపటిసారి యౌషధముగా నిశ్చయించి యట్లు మూడవపర్యాయము రెండుమాసములకు సరిపోవు నౌషధమునిచ్చెను. ఈయౌషధమును రెండుమాసములు సేవించిన ఫలముతో దోషోపశమన మాత్రములగు పూర్వపు ఔషధములు రెండు సంవత్సరములు సేవించినను ఫలము సరిపోల్పరాదు. అట్టి యీయౌషధమునే చచ్చి దేవతలలో పుట్టి బాలుఁడనైన యేను వృద్ధిపొందుటకు గాను ఉద్దేశించి శ్రీభద్రకాళి యిచ్చెననియె. ఈయౌషధమును 1910 సం॥ ది 1 డిశంబరు ప్రాంతమందు తీసికొంటిని. వెంటనే నందివెలుగు స్కూలుమేష్టరును అయితిని. ఈయౌషధమునకు నేను వల్లూరునకు వెళ్లినప్పుడే "తనను పాముహాసయని పేరు పెట్టుకొనుమని శ్రీరాములవారు తనతో చెప్పిరని మాగురువులవారు నాతో చెప్పియుండిరి.

మా తమ్ముఁడు చక్రపాణిరావు వివాహము 1911 సం॥ ది 16 ఏప్రిల్ ప్రాంతమున జరిగెను.

పిమ్మట 15 దినములకు సంవత్సరాదిపాడ్యమి పండుగ వచ్చెను. కవిచీమం చముక్రిందికి రాలినమెతుకులు పట్టించుకొనిపోవుట తటస్థించి వల్లూరుగ్రామములో పండుగదినమున నుండఁజాలనైతిని. పండుగదినమున మా గురువులవారు వల్లూరులో లేరయ్యె. చల్లావారికి పెంపుడివ్వఁబడిన వారితమ్ముఁడు చల్లా సూర్యనారాయణమూర్తిగారు నన్ను పండుగదినమున లెస్సగా సన్మానించి సాదరంబున భోజనం బిడి ప్రస్థానవేళమున నన్ను "విశేషకాలములేదు. త్వరలోనే ముక్తిని పొందెదవు. మరియు మునుపటి యౌషధంబును తీసికొనియుండవు" అనిరి.

రాజకోటీశ్వరులగు మా గురువులవారి భార్యాపితరులును సోదరియును మామయును ధనాకాంక్షచే పట్టుబడి శ్రీరామస్వామ్యుఁడగు మా గురువులవారిని సర్వజనోత్కృష్టునిఁగా దలంపనేరక సామాన్యజన్మునిగాను తమవంటి నరునిగాను భావించి దరిద్ర్యాకర్షణ సేయనేరఁడని చేసిన యవమానములు మనుష్యమాత్రునకు జాలింబుట్టింపకఁబోవు. ఇట్లవమానింపఁబడి విడినైనంగాని పెక్కండ్రు అధికారులగు వారు ముక్తిని బొందఁజాలరని దేవరహస్యము.

అట్టి యవమానస్థితిని దగిలియున్న మా గురువులవారిని సందర్శించునిమిత్తమును నాయొక్క క్షేమముకొఱకును నేను ది 10 మెయి ప్రాంతమున మూలపూరుగ్రామమునకు వెళ్లితిని. మాయుభయులకును పరస్పరము ఒకరివల్ల ఒకరికి క్షేమము కలుగునట్లు విధి నిర్మాణించియుండినది యెఱిఁగియుండెను. తప్పదను నిశ్చయముతో సాదరంబున భోజనంబిడి స్నేహసంభాషణము కొంతవడి జరిపెను. ఎప్పటికైనను నాకు శుభము కలుగకపోదను నిశ్చయముతో నేనును ధన్యతముఁడనుగా తలంచి సంతృప్తుఁడనైతిని.

తరువాత గురువులవారు వారమురోజులలోనే నందివెలుగునకు దయచేసిరి. ఒక నెలరోజులు నాయొద్దనుండిరి. పిమ్మట వారికి కొంతపైకమిచ్చి కార్యమునకు వెళ్లితిని.

16. గురువులవారి రెండవరాక:—కార్యానంతరమున మా గురువులవారిని నాయొద్దనే యుండుఁడని ప్రార్థింపగా వారును సమ్మతించియుండిరి. ఇట్లొకమా

డలమురోజులు నాసన్నిధినుండి గురువులవారు తమతమ్మునియొక్కను వల్లూరు గ్రామమునకు వెళ్లిరి.

17. గురువులవారు మూడవపర్యాయము అస్మద్గృహమునకేతెంచుట. ఉద్దేశము. భావికాలసూచకమగు పూర్వపు స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవప్రారంభము. గురువులవారి రౌద్రము. గురువులవారికి కొమారుడనై పుట్టుట. కులవిద్య నభ్యసింపదగినకాలమువచ్చుట. మహానవమి దీపావళి. గురువులవారు నన్ను వెంటబెట్టుకొని వల్లూరునుండి బయలువెడలుట. స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవముపరి సమాప్తి:—గురువులవారు మూడవపర్యాయము 1911 సం॥ ది 20 అక్టోబరు ప్రాంతమున మాయుభయుల పూజలందుటకు నందివెలుగుకు విజయంచేసిరి. నేనును ముక్తినిబొందగలుగుదునని తలంచితిని. వారును నావలన శాశ్వతకీర్తి తమకు కలుగునని యెంచియుండిరి. కాని పెక్కుకష్టములు పెట్టినది గురుశిష్యన్యాయము జరుగనిది మోక్షాపేక్షచే ఇతరేతర ధర్మములయందు లక్ష్యములేమి కనుబడనిది అనన్యభక్తితో తనను కొలువనిది తనకు శాశ్వతకీర్తి కలుగదని తలంచిరికాని పైనజెప్పిన వేవియు జరుగనిదియే తనకు శాశ్వతకీర్తి కలుగునుపాయముండెనని తలంచనేరరైరి.

అట్లగుటంజేసి నాయవచ్చిన దానిగానో ఇతరధర్మములయందు రాగమును తానెన్నికష్టములుపెట్టినను తనయందు ద్వేషములేక నిశ్చలభక్తితో నిలువగల నేమో చూడవలెనని తలంపుగొనిరి. ఆకారణమున పరస్పరము మాయుభయులకును నడచిన ప్రవర్తనము పంతమై ఒకలకు స్వప్నమునందలి మొదటిభాగమును బోలినదై సామాన్యవిధముననే డిశంబరు ఆఖరువరకు నడచినదయ్యెను. మాగురువులవారు జరామరణరహితులగు సిద్ధపురుషులనికాని నేను మోక్షాపేక్షతో వారిపరిచర్య చేయుచుంటిననిగాని ఒకరును తెలియజాలరైరి.

అది కారణంబుగా త్వరలోనే నన్ను ధన్యునిజేయవలయుననియును తానును శాశ్వతకీర్తిని పొందవలెననియును ఉద్దేశించి చూపులకు విపరీతముగునట్లు పరిచర్యలెప్పగానొన ప్రారంభించిరి. వారు కోరినట్లు పరిచర్య ప్రసంగమునందు రాగమును గురువులవారియందు ద్వేషమునువదలి చక్కగాజేసి మెప్పించితిని. ఇట్టి కఠినపరీక్ష డిశంబరు ఆఖరున ప్రారంభించి 1912 సం॥ ది 20 జూలయివరకు నిలిచెను. అప్పటికి కన్నెగంటి రెడ్డెమ్మగారికి ఆడకొమాళ్లను తెనాలిలోనో గుంటూరులోనో

ప్రవేశపెట్టదలచి నన్నుకోరిన నేనట్లేచేసితిని. ధర్మము ననుసరించి బడియుండు నంతవరకు నేను పైనజెప్పిన విధమున రాగద్వేషములనువదలి గురువులవారిని సేవించ వలసినదేయగును. ఈ రాగద్వేషములనువదలి గురువులవారిని సేవించినకాలము పూర్వపు స్వప్నముయొక్క రెండవభాగపు ప్రత్యక్షానుభవమయ్యెను. చదువ రుల కెల్లరకును అకాలమంతయును నేను యధాశాస్త్రీయముగా చనిపోయియుం డినసంగతి విశదముకాకపోదు. అట్లు బడిపోవుటచేత ఒకవేళ పితృసంబంధమగు నాస్తియుండినను దానిచేత తనను పూజించుమనుట గురువులవారికి ధర్మము కాదు గనుక ధర్మమునకు ధర్మమునుకాగా నాయందలి ప్రేమచేతనుకూడా గురువులవారు నేను తనకు యధాశాస్త్రీయముగా కొమారుడనై పుట్టినది యెఱిగి తనతో రమ్మ నిరి. నాచేత సత్యముచేయంబడుటయును వ్రతినిబొందినదై నాయాజ్ఞానుసార ముగా కోడూరుగ్రామములో నాభార్య జననమందెను. నేనట్లు మనుష్యులలో నుండి వచ్చి గురువులవారికి పుత్రుడనై కల్లూరుగ్రామములో దేవతలగు మాగురు వులవారు వారిముద్దు సూర్యనారాయణమూర్తిగారు వీరలలో ఒకడనై పుట్టి తిని. దేవతలందరును పైనబోవుచు "సెబాస్! మనలో తప్పక యుండవలసిన వాడు. వీడు గడచిన తొమ్మిదిసంవత్సరముల కర్మనై యిప్పుడు ప్రకృతి మగ్నమై యున్న యీతని సుగుణములును నిర్గుణస్వభావమును ఎప్పుడోకో చూచుటయని యువిళ్లూరుచున్నారము. పుత్రవత్సలుడగు తండ్రి లెస్సగా పోషించి యీతనిని అచిరకాలంబున మాకోర్కెకి వచ్చువానింగా చేయుగాతని" యని తలంచుచుండిరి.

అట్లుపుట్టి తదనంతరమున ఒకనెల పదిమూడుదినములకు వినాయకచవితి నాగా అప్పటికి బాల్యావస్థవదలి కులవిద్య నభ్యసింప నధికారినైతిని. కాని మానా యనగారు నాకు కులవిద్య నుపదేశించిన వారుకారు తరువాత నెలరోజులకు మహర్నవమికి మానాయనగారు నాకు కులవిద్య నుపదేశించి అప్పుడే నేనుకోరిన చోట వివాహముచేయుదురని తలంచితినిగాని యీయాశయము వృథాతలంపేయయ్యెను. తరువాత దీపావళిపండుగకైన నింతవిద్యనిచ్చి వివాహము చేయకపోవుదురాయని నమ్మితినిగాని యీనమ్మకమును వృథాయయ్యె. నామీద మానాయనగారికి ప్రేమ లేదేమో అనుకొందమన్న అట్లు లేకపోలేదు. ఇంటిలో పెత్తనమంతా నాదే. పెట్టెలో పైకమంతా నాదే. నేనెంతఖర్చుపెట్టుకొన్నను అదేమియనువారులేరు. ప్రతిపూట నెయ్యికొల్ల. పెరుగుకొల్ల. ఏదియును తరుగులేదు. వస్త్రముల న్నియును నావే. కోట్లన్నియును నావే. నామాటయన్న మానాయన గారికిని మాకక్కయ్యగారికిని మహాగౌరవము. కూర్చుండుమన్న కూర్చుం దవారలు నిలచుండుమన్న నిలుచుండువారలు. కనుక మానా

డలమురోజులు నాసిద్ధనుండి గురువుగారు తనతమ్మునియొద్దను నల్లూరు గ్రామమునకు వెళ్లిరి.

17. గురువులవారు మూడవపర్యాయము అస్మద్గృహమునకేతెంచుట. ఉద్దేశము. భావికాలసూచకమగు పూర్వపు స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవప్రారంభము. గురువులవారి రౌద్రము. గురువులవారికి కొమారుడనై పుట్టుట. కులవిద్య నభ్యసింపదగినకాలమువచ్చుట. మహర్నవమి దీపావళి. గురువులవారు నన్ను వెంటబెట్టుకొని నల్లూరునుండి బయలువెడలుట. స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవముపరి సమాప్తి:—గురువులవారు మూడవపర్యాయము 1911 సం॥ ది 20 అక్టోబరు ప్రాంతమున మాయుభయుల పూజలందుటకు నందివెలుగుకు విజయంచేసిరి. నేను ముక్తినిబొందగలుగుదునని తలంచితిని. వారును నావలన శాశ్వతకీర్తి తమకు కలుగునని యెంచియుండిరి. కాని పెక్కుకష్టములు పెట్టనిది గురుశిష్యన్యాయము జరుగనిది మోక్షాపేక్షచే తదితర ధర్మములయందు లక్ష్యములేమి కనుబడనిది అనన్యభక్తితో తనను గొలువనిది తనకు శాశ్వతకీర్తి కలుగదని తలంచిరికాని పైనజెప్పిన వేవియు జరుగనిదియే తనకు శాశ్వతకీర్తి కలుగునుపాయముండెనని తలంపనేరైరి.

అట్లగుటంజేసి వాకువచ్చిన దాడిగామోక్షేతర ధర్మములయందు రాగమును తానెన్నికష్టములుపెట్టినను తనయందు ద్వేషము లేక నిశ్చలభక్తితో నిలువగలనేమో చూడవలెనని తలంపుగొనిరి. ఆకారణమున పరస్పరము మాయుభయులకును నడచిన ప్రవర్తనము పంతమై జనులకు స్వప్నమునందలి మొదటిభాగమును బోలినదై సామాన్యవిధముననే డిశంబరు ఆఖరువరకు నుండినదయ్యెను. మాగురువులవారు జరామరణరహితులగు సిద్ధపురుషులనికాని నేను మోక్షాపేక్షతో వారిపరిచర్య చేయుచుంటిననిగాని ఒకరును తెలియజాలరైరి.

అది కారణంబుగా త్వరలోనే నన్ను ధన్యునిజేయవలయుననియును తామును శాశ్వతకీర్తిని పొందవలెననియును ఉద్దేశించి చూపటకు విపరీతముగునట్లు పరిచర్యలెన్నగాగొన ప్రారంభించిరి. వారు కోరినట్లు పరిచర్య ప్రసంగమునందు రాగమును గురువులవారియందు ద్వేషమునువదలి చక్కగాజేసి మెప్పించితిని. ఇట్టికఠినపరీక్ష డిశంబరు ఆఖరున ప్రారంభించి 1912 సం॥ ది 20 జులయివరకు నిలచెను. అప్పటికి కన్నెగంటి రెడ్డెమ్మగారికి చినకొమాళ్లను తెనాలిలోనో గుంటూరులోనో

ప్రవేశపెట్టదలచి నన్నుకోరిన నేనట్లేచేసితిని. ధర్మము ననుసరించి బడియుండు నంతవరకు నేను పైనజెప్పిన విధమున రాగద్వేషములనువదలి గురువులవారిని సేవించ వలసినదేయగును. ఈరాగద్వేషములనువదలి గురువులవారిని సేవించినకాలము పూర్వపు స్వప్నముయొక్క రెండవభాగపు ప్రత్యక్షానుభవమయ్యెను. చదువరుల కెల్లరకును అకాలమంతయును నేను యథాశాస్త్రీయముగా చనిపోయియుండినసంగతి విశదముకాకపోదు. అట్లు బడిపోవుటచేత ఒకవేళ పితృసంబంధమగు నాస్తియుండినను దానిచేత తనను పూజింపుమనుట గురువులవారికి ధర్మము కాదు గనుక ధర్మమునకు ధర్మమునుకాగా నాయందలి ప్రేమచేతనుకూడా గురువులవారు నేను తనకు యథాశాస్త్రీయముగా కొమారుడనై పుట్టినది యెఱిఁగి తనతో రమ్మనిరి. నాచేత సత్కృత్యముచేయంబడుటయును ప్రాప్తినిబొందినదై నాయాజ్ఞానుసారముగా కోడూరుగ్రామములో నాభార్య జననమందెను. నేనట్లు మనుష్యులలోనుండి వచ్చి గురువులవారికి పుత్రుడనై కల్లూరుగ్రామములో దేవతలగు మాగురువులవారు వారిమిత్రుడు సూర్యనారాయణమూర్తిగారు వీరలలో ఒకడనై పుట్టితిని. దేవతలందరును పైనబోవుచు "సెబాస్! మనలో తప్పక యుండవలసినవాడు వీడు గడచిన రేనిమిదిసంవత్సరముల కర్మకై యిప్పుడు ప్రకృతి మగ్నమైయున్న యీతని సుగుణములును నిర్గుణస్వభావమును ఎప్పుడోకో చూచుటయని యువ్విళ్లూరుచున్నారము. పుత్రవాత్సల్యుడగు తండ్రి లెస్సగా పోషించి యీతనిని అచిరకాలంబున మాకోర్కెకి వచ్చువానింగా చేయుగాతని యని తలంచుచుండిరి.

అట్లుపుట్టి తదనంతరమున ఒకనెల పదియేనుదినములకు వినాయకదేవర చవితిగాగా అప్పటికి బాల్యమంతవదలి కులవిద్య నభ్యసింప నధికారినైతిని. కాని మానాయనగారు నాకు కులవిద్య నుపదేశించినవారుకారు తరువాత నెలరోజులకు మహర్నవమికి మానాయనగారు నాకు కులవిద్య నుపదేశించి అప్పుడే నేనుకోరినచోట వివాహముచేయుదురని తలంచితినిగాని యావత్తును వృథాతలంపేయయ్యెను. తరువాత దీపావళిపండుగకైన నింతవిద్యనిచ్చి వివాహము చేయకపోవుదురాయని నమ్మితినిగాని యీనమ్మకమును వృథాయయ్యె. నామీద మానాయనగారికి ప్రేమ లేదేమో అనుకొందమన్న అట్లు లేకపోలేదు. ఇంటిలో పెత్తనమంతానాదే. పెట్టెలో పైకమంతానాదే. నేనెంతఖర్చుపెట్టుకొన్నను అదేమియనువారులేరు. ప్రతిపూట నెయ్యికొల్ల. పెరుగుకొల్ల. ఏదియును తరుగులేదు. వస్త్రములన్నియును నావే. కోట్లన్నియును నావే. నామాటయన్న మానాయనగారికిని మాఅక్కయ్యగారికిని మహాగౌరవము. కూర్చుండుమన్న కూర్చుండువారలు నిలుచుండుమన్న నిలుచుండువారలు. కనుక మానా

యునకక్కయ్యగార్లకు నామీద ప్రేమ లేకపోలేదు. ఏమికారణముచేత నాయొక్క శ్రేయస్సును మానాయనగారు ఉపేక్షించియున్నారు ? అని నాలో నేను విచారించుచుంటిని. అట్టిసమయములో మానాయనగారు నన్ను వెంటబెట్టుకొని కల్లూరు నుండి బయలుదేరి నందివెలుగుకు వచ్చిరి. అప్పుడు నేను వారినివీడ్కొని తండ్రి కొడుకులమగు మాయుభయుల శ్రేయస్సునుగోరి దక్షిణాభిముఖుడనై పయనమైతిని. భార్య పుట్టినింటవదలి భార్యను పుట్టినింటనదలి గురువులవారియొద్ద నాయీ గడపిన మూడుమాసముల యిరువదిదినములును స్వప్నపు మూడవభాగముయొక్క ప్రత్యక్షానుభవమైయుండెను. ఇట్లు స్వప్నముయొక్క ప్రత్యక్షానుభవము ముగిసెను.

18. దక్షిణయాత్రలు సేవించుటచే పొందిన ప్రయోజనము:—అట్లు 1912 సం॥ ది 16 నవంబరు తారీఖున దక్షిణాభిముఖుడనై పయనమై శ్రీరంగమునకు వెళ్లితిని. శ్రీరంగనాయకులవారిని దర్శింపగల్గితినిగాని కోరిన గుంటూరు జడ్జి రాయబహదూరు టి. టి. రంగాచారిగారు అచ్చటలేరైరి. వారు తిరువళ్లూరు పురీనివాసులని తెలిసి అచ్చటికి వెళ్లితినిగాని పూర్వము నేనువారికి వ్రాసియుండిన కాకితములేమియును వారియొద్ద లేవయ్యెను. ఉండినయెడల నేను వ్రాసియుంచిన కాకితములు పంపించవలసినదని ఎంతయో ప్రార్థించుచు 1912 సం॥ జూలయి 14, 21, 30 తేదీలన నేను వారిపేరటికి శ్రీరంగమునకు వ్రాసియుండిన మూడులేఖనములును తనకు శ్రీరంగమునుండి వచ్చెననియును అవియును తనవద్దలేవనియును చెప్పిరి. కనుక మరలి 1913 సం॥ ది 26 వ మార్చి తారీఖున గుంటూరునకు వచ్చితిని. నేను పూర్వము వ్రాసియుండిన కాకితములు రికార్డైయుండెనేమో విచారించిన గడచిన జనవరినెల రెండవతేదీన అవి నశింప జేయబడెనని తెల్పిరి.

ఒక్కటియగు నాత్మతత్త్వంబున రూపనామంబగునటుల ధ్యానము నభ్యసింపగల నేర్పుగలవారలు మహాస్థలములయందు అత్యంత సుఖముగా చిత్సూర్యోదయమును పొందగలిగి సుఖింపనేర్తురు.

గురుకార్యార్థమైయే వెళ్లక తప్పకయే యిట్లు దక్షిణాభిముఖుడనై వెళ్లి గడపక తప్పని నాలుగు మాసములకాలమున లేఖన మొక్కటైనను వేయక భార్యనగయిరాను దుఃఖింపజేసియును వచ్చి దేవతలలో పుట్టినది ప్రత్యక్షము

నీసియను జడ్జీగారికి వ్రాసిన కడపటిలేఖనముయొక్క అంతమందు కనఁబడిన లక్ష్యమును ప్రత్యక్షానుభవము సేసినవాఁడనైతిని.

19 విన్నపము:—కర్మయోగము సిద్ధియగుటచేతనుగాని పరమగురువులవల్ల లక్ష్యపూర్వకముగా ఆత్మయొక్క బహిర్తత్త్వము తెలుపఁబడుటవల్లగాని అమృతరూపమున ఆత్మానుభవము సేసి సంకల్పరహితులగు దరింతియాగాని భగవత్సామ్యుఁడగు పరమగురువును ప్రత్యక్షమున పూజించి తదనుగ్రహమునుపొంది "ఆత్మయొక్క అంతర్తత్త్వమును" బోధింపబడనియెడల జీవసంబంధమగు తెలివిని అఖండాద్వైతీరు పరిపూర్ణమును పరమాత్మస్వరూపమును అగు తెలివియందు ఐక్యముజేయు వీల్ప గలుగదు గనుక అట్టివారలెవరును ఆత్మసాయుజ్యమున జ్ఞానము ననుభవింపుము శరీరమును శాశ్వతముగా నిలుపుకొనుటయను మోక్షమునుగాని కోరినప్పుడు శరీరమును వదలి పరమాత్మయగుటయను మోక్షమునుగాని పొందనేరరు. కనుక శ్రీసద్గురుమూర్తులగు సన్మనాచార్యులవారిని చక్కఁగా సేవించి మోక్షమును పొందుదురుగాకయని ప్రార్థించుచున్నాను.

గురువు భగవంతుఁడగుట నిశ్చయము. ఏలననఁగా ఉపనిషత్తులు భాష్యములు ఎన్నిపరాయణములు చదివినను ఏకరువుపెట్టినను తటిబనను వెన్నదీసినను సద్గురువుచేత తత్త్వోపదేశము వడయనిది మోక్షములేదు. ఇది సత్యము. సత్యము. సత్యము. పురుషుఁడు తత్త్వోపదేశమును పొందినమీదట జాగరూకుఁడై భగవంతునారాధించిన అప్పటికి పురుషప్రయత్నము తత్త్వము తెలియుట భగవదనుగ్రహము అను మీమూడును ఏకమై జీవసంబంధమగు తెలివిని పరమాత్మసంబంధమగు తెలివియందు ఐక్యముచేయు సమర్థుఁడైన తరువాతనుకూడా ఆపురుషుఁడు సంకల్పములను వదలకయే అనగా సంకల్పములు పెట్టుకొని జీవసంబంధమగు తెలివిని పరమాత్మస్వరూపమగు తెలివియందు ఐక్యముచేసి శరీరమును వదలినను ఓమ్మట పదివేల సంవత్సరములకైనను పూర్వపు సంకల్పానుసారముగా జీవుఁడై పుట్టునుగాని పుట్టకపోఁడు. కనుక సర్వసంకల్పములను వదలి ఆత్మయందు కలియవలయునని భావము. పురుషుఁడు ఏదైనైన బాధపడునప్పుడు ఆబాధ ఆత్మకనిగాని జడమగు శరీరమునకనిగాని చెప్పుటకు వీలులేక అనుభవమునకుమాత్రము తప్పనిదై యుండునట్లు మోక్షము ఆత్మకనిగాని జడమగు శరీరమునకనిగాని చెప్పుటకు వీలులేదుకాని సద్గురువును

సేవించి "తత్త్వోపదేశము" ను వడయనిది మోక్షములేదను మాటమాత్రము నిశ్చయము. నిశ్చయము. నిశ్చయము.

దారాపుత్ర విత్తాదులయందలి కామ్యమేదియో అదియే సంకల్పశబ్దవాచ్యమైయున్నది. ఏమను ఆశరీరమునే చంపును. సంకల్పములు ఎన్నియో శరీరములను చంపును. గనుకను జ్ఞానదృష్టియందు జన్మములను నవిలేక ఒకేగుణప్రవాహమగుటయును కారణముగా సంకల్పమును బలవంతముగా వదిలిపెట్టఁగలవానికి మోక్షప్రాప్తి కలుగునుఅని వేదాంతగ్రంథములయందు వ్రాయఁబడియున్నను భగవదనుగ్రహమున సద్గురులాభముకలిగి తత్త్వోపదేశము వడయనిది మోక్షము కలుగనేరదని తెలియవలసినది.

20. చచ్చి దేవతలలోఁ పుట్టుట—కేవలము ధర్మయుక్తము:—స్వప్నత రెండవభాగముయొక్క ప్రత్యక్షానుభవప్రారంభంబున గురువులవారు నన్ను కఠినముగా పరీక్షసేయ నుపక్రమింప నేను రాయబహాదూర్ టి. టి. రంగాచార్లుగారి యొద్దనుజని కాళ్లవేళ్లపడి లోకమాన్యులగు హరిశ్చంద్ర ధర్మజ విక్రమార్కాదులతోను నిర్గుణవస్త్వానుభవ స్తవంబుల వశిష్ఠాదులతోను సమత్వము నొందు వట్లు లోకవిదితముగా కంకణము గట్టుకొని నేనువ్రాసిన కాకితములైనను మూడుసంవత్సరములుగా వారి స్వాధీనానుభవములలోనుండి వారియాస్తియగు ద్రవ్యమును గ్రహించుటకు అర్హురాలినై మాగురువులవారు పరమగురువులను కీర్తిని జగత్తున విస్తరింపనెంచి మాగురువుగారిని "సూర్య చంద్రాదులుండు వరకు జగత్తున నశింపనిదగు కీర్తినిచ్చెదను ఔపధక్రమమును ఆత్మతత్త్వముము బోధింపుఁడు" అని ప్రార్థించితిని. "కీర్తి యెవనికి కావలెను? తనయుఁడవై పుట్టి అధికారివగు కాలమువరకునుండి వేటికొఱకు పుట్టి పెరిగితివో వాటిని తీసికొమ్ము" మనిరి. రాయబహాదూర్ టి. టి. రంగాచార్లుగారు నన్ను స్వపుత్రికైనను వారి ఆస్తులయందు ప్రవేశింపకఁజోఁడను భయంబు విడువనిదగుట చేత తనయుఁడనుగానిది యితరుల ద్రవ్యమును అపేక్షింపను. మఱియు కావలసినవాటియందు విరక్తనిపోంపను. కనుక గురువులవారి నిర్బంధమునకు "ఉచితము" మంటిని. పలవిద్య నభ్యసింపఁదగిన వయస్సురానిది నేనెక్కడను పోరాదు గనుక వినాయక దేవర చవితివరకు నుంటిని. మహార్ణవమివరకు నుంటిని. దీపావళివరకు నుంటిని. దీపావళిగడచి ఆరురోజులకొక్కెన. పెండ్లి

కాయస్సును తప్పిపోవుచుండెను. నేనంతటివాఁడనుగానాయేమి ? వివాహ మునందచేతుకలుగనాయేమి ? రాయబహద్దూర్ టి. టి. రంగాచార్లగారివద్ద నుండిన కాకితములను తీసికొనక నేను స్వయముగా గురువులవారికి కీర్తి నివ్వఁ బూని వృథా ప్రయాసంబగునను భయముచేత వివాహేచ్ఛ యతిశయిల్ల నూర్పులేమిచే దక్షిణయాత్ర సేయ నాయత్తమైతిని. దేవగురువగు వశిష్ఠునిచే జ్ఞానోపదేశంబునడసి శరీరమంతటను తొలికిసలాడు పీనిదసముకలిగిన యేను సర్వేశ్వరుఁనకు శిరము బావహిల్లినట్లు వైరాగ్యంబువదలి వసుసగా నుకొర్కెక్ర యుత్తాముని నగ్నిప్రవేశము కాఁబోవుచుంటినని యును అజ్ఞాతవాసముచే మగ్నమంటినని యును దీనిని రక్షించి కన్నతండ్రిరింబోలుమనియును నేను తినకు పూర్వము వ్రాసియుండిన కాకితములు పంపుమనియును జవాబైనను వ్రాయు మనియును 1912 సం॥ జూలయి నెలలో వ్రాసియుండిన మూడు లేఖనములకు జవాబుగా "నీవుకోరిన కాకితములు గుంటూరులో దొరకును" అనికారి కార్డు వ్రాయబాలని దివాన్ బహద్దూర్ టి. టి. రంగాచార్లగారు ఆయునయొద్దనుం డినవనియే ననుకొనిన నా కాకితములు నాకు నిరలనిచ్చువిషయములో సందియ పడితిని. కాకితములు నాకు దొరకనిది నేను గురువులవారికి కీర్తి నివ్వగలు గుదునో లేక వృథా ప్రయాసపడువాఁడనగుదునో యని చింతించితిని. కాకి తములు గుంటూరులో నుండెననిమాత్రము ఎప్పుఁడును తోచనిదయ్యె. కనుక దక్షిణయాత్రమాత్రము తప్పనిదయ్యె. ప్రయోజనము విషయములో సంది యము కలిగినదయ్యె. వివాహేచ్ఛ మెండయ్యె. గురువులవారిని వేటికా లము సేవించి కొమారుఁడనై పుట్టితినో వాటిని పొందనిది వివాహమాడరా దయ్యె. "వివాహమున కిప్పుఁడేమితొందరలే. పర్యాయాలిన చేయరాదా ? కోరినవాటి నిచ్చియే వివాహము చేసెదలే. ఇప్పుఁడేమితొందరవచ్చెను ?" అని మాగురువులవారు జాగుప్సాపూర్వకముగనండిరి. నేనుమాత్రమట్లుగాక "ఎప్పుఁడు తత్త్వోపదేశమును పొందెదనా ? ఎప్పుఁడు వైవథక్రియమును తెలుపబడెదనా ? ఎప్పుఁడు వివాహముచేసికొందునా ? ఎప్పుఁడు కీర్తిగనఁగుఁ డనగుదునా ? ఎప్పుఁడు శరీరమును పంచభూతములలో సాక్రుకిఁదా నితో నద్వితీయత్వమును పొందింతునా ? ఎప్పుఁడు ప్రపంచంబులేదను దృష్టి ప్రత్యక్షానుభవమునను పిద్ధియగునా ? ఎప్పుఁడు వశిష్ఠులవారివలె డెప్పుటికి కీర్తిగాఁగగుదునా ?" యని యుంటిని. అట్లు వేగిపడు నేను అబద్ధమున

కైనను పాల్పడి "మీరు నా కాకితములు నాకివ్వనిచో మా గురువుగారు నాకు నేనుకోరినవాటినివ్వరు. వివాహముచేయరు మీరు నాకాకితములని చ్చిన ; నాకు వివాహముచేసినట్లు. కీర్తినిచ్చినట్లు. ఎంతయో యుపకారముచేసినట్లు" అని నీచమని సాధులచే నెంచబడి నాకు కేవలము ధర్మయుక్తమని తోచిన ముఖస్తుతులుచేసి అవసరము ననుసరించి వేషములు వేసికొనియో లేక వారికి వ్రాసియుండిన కడపటి యుత్తరమునందు చెప్పినవిధముగా ప్రవర్తించెదనని కంకణముకట్టుకొనియో కార్యము సానుకూలము చేసికొన సమకట్టితిని. అట్లు గురువులవారికి ఎదురెత్తుగా ప్రవర్తించి శీఘ్రముగ శుభమును పొందదలచిన నేను "అనుగులోనే హంసపాదా? నక్కయెక్కడ? దేవలోకమెక్కడ? నీకును వారికిన్ని పోల్కయా?" యని పెద్దలవలన తగ పాకరముకలిగి కార్యభంగము కాకుండుటకుగాను తిరువళ్లూరులో టి. టి. రంగాచార్లుగారిని దర్శించుటకును మాగురువులవారికి ఉత్తరములువ్రాయుటకు వీలుపడదయ్యెను. అట్లు దర్శించి వెంటనే రైలుఎక్కి గుంటూరులో కాకితములు దొరకకపోయినప్పుడు నంపి వెలుగును ఉత్తరము వ్రాయుటయును అచ్చటికి వెంటనేవెళ్లి మాగురువులవారిని సందర్శించుటయును కలిగెను. యాత్రవలన ప్రయోజనంబు కలుగకపోవునేమోనను భయంబుచేత యాత్ర చేయదలచినట్లు చెప్పనైతిని. రైలుఛార్జి కావలయునని యడుగనైతిని. 1912 వ సం॥ ది 26 జూలయి ప్రాంతమున నేను పెనుకుదురుపాడునకు వెళ్లినప్పుడు మాఅమ్మయును మాతమ్ముడును "నిన్నునమ్మి గింజలను అమ్మివేస్తిమి. మాసంగతియేమీకు పట్టదుకదా! కష్టము లెన్నిపడితిమో యెరిగియును ఎరుంగవు. నీవలన ఒకదమ్మిడీ యెరుంగముగదా!" అనగా వీరికిని నాకును ఋణాముతీరెననుకొంటిని. నాకు వివాహమైయుండలేదు గనుక కోడూరునకు లేఖనము వ్రాయవలసినట్టి యవసరము కనబడదయ్యెను. ఇట్లు నాదుమార్గము కేవలము ధర్మయుక్తమయ్యెను. బ్రహ్మ విష్ణ్వీశ్వరాదులచేసహితము నతిక్రమింపరానిదై జీవకోట్లనడుపు పరాప్రకృతిస్వరూపముగు "ధర్మము" ననుసరించియే మాగురువులవారిసొత్తు ననుభవించుట కధికారినైతినని తెల్లడించుచుంటిని గనుక నీతెల్లడించురూపమున "పుట్టితి" ననుభావమును ప్రకటించితిని.

కాని గడచిన దీపావళికే తెండ్లివయస్సు మిగిలి పిమ్మట సంక్రాంతి సంవత్సరాది పండుగలును గడచిన నేను ప్రవర్తిసంబంధముగు కార్యముల భారము వహింప

గలిగి యాయనంతవాఁడనైతిని గనుక క్షణములో మిథ్యకానున్న ప్రవృత్తివిషయమున వ్యర్థమగు చింతనువదలి మానాయనగారు ప్రవృత్తిసంబంధమగు కార్యములను నడుపు నుపకరణంబగు సరస్వతిని వాకిచ్చి సమస్తవస్తుపరికరమును స్వాధీనముచేసి తాను సరస్వతియొక్క భర్తయగు బ్రహ్మముతో ప్రత్యక్షైక్యభావమును పొందియుండుట యర్థమని నాదుభావము.

21. గురువులవారి ప్రభావము:—భూత భవిష్యద్వర్తమానములను తెలియగలరు. మనస్సులోని సంగతులను తెలియగలరు. కన్నులు మూసికొనమనిచెప్పి కోరి నవస్తువులను చూపించగలరు. అతిచిత్రముగా స్వప్నములను ప్రదర్శింపఁజేయ గలరు. ఏసంగతినైనను తెలిసికొనదలచిన తెలిసికొనగలరు. ఇవియన్ని యును పరమగురువు లక్షణములు.

22. ఆత్మానుభవమునందును అద్వితీయుఁడ నగుటయందును వశిష్ఠసముఁడను కాగో రుచున్నాఁడను గనుక మద్గురువర్యులగు శ్రీకుల దుర్గాప్రసాదరావుగారు కాళికాదేవి నేను వృద్ధిపొందుటకుగాను వారితో చెప్పివెల్లిన "యావధక్రమమును" నాకు తెల్పి "ఆత్మయొక్క అంతర్గతత్వమును" నాకు బోధింతురుగాక యని మాగురువులవారిని ప్రార్థించుచు నింతటితో సర్వమును ముగించుచున్నాఁడను.

మంగళంభగవాన్విష్ణు । మంగళంమధుసూదనం । మంగళంపుండరీకాక్ష । మంగళంగరుడధ్వజ । నీలాచలనివాసాయ । నిత్యాయపరమాత్మనే । శుభద్రప్రాణ నాథాయ । శ్రీజగన్నాథాయమంగళం ॥

ఇట్లు బుధజనవిధేయుఁడు,

పోచిరాజు ఆదినారాయణ.

